శ్రీ

# బాలశతకము



 గ్రంథకర్త; 

కొణిదెన వేంకటనారాయణ.

శ్రీ

# బాలశతకము.

గీ॥ శ్రీలఁ జెన్నొందు శ్రీహరిఁ జిత్తపీఠి
భక్తితోఁ బూజసేసియుఁ బ్రస్తుతించి
సిద్ధకవిపుంగవుల నెల్ల నెంతుమదిని
లలితపదములతో నీతులొలుక బాల॥ ౧

గీ॥ శ్రీయు నారోగ్యసంపద స్థిరయశంబు
నాయురర్థముల్ విద్యయు న్యాయబుద్ధి
నిచ్చు; నీచిన్నిపొత్తంబు నీవుపట్టి
చిన్ననాఁటనె చదువుచు నున్నబాల॥ ౨

గీ॥ పుట్టితివి నీవు పుడమిపైఁ బూర్వపుణ్య
ఫలమువలనను మనుజ సంభవుడవగుచు
నింక నీవుండు పద్ధతు లేర్పడంగఁ
దెల్పెదను జేటమాటలఁ దెలియు బాల॥ ౩

గీ॥ తల్లిదండ్రుల నిష్టదైవములను
విద్య నేర్పిన గురులను బెద్దవారిఁ
దగిన చెలికాండ్ర సేవింపనగును నీకుఁ
జెందెదవు దానశుభములు చిన్నిబాల॥ ౪

గీ॥ శాంతగుణ మొకండుగల్గిన సద్గుణములు
వేయిగల్గినయట్ల; దిపాయునెడల
సకలశృంగారములతోను బాలు తాళి
లేనిస్త్రీవలెనగు దానిఁ బూను బాల॥ ౫

గీ॥ ఎవరికిని నిన్నుఁజూచిన నింపుఁబుట్టు
నటుల వినయంబుతోనుండ నానుజుమ్మి
యెవ్వరేమేమి చెప్పిన రవ్వసేయ
కాత్మఁదలపోసి చేయుటయగును బాల॥ ౬

గీ॥ పరులనిందింపఁ బూనకు; పొరుగువారి
కలిమిఁ జూచిన నేడ్వకు; చలముచేత
పట్టితిప్పలేరికైనఁ గట్టఁబోకు;
పాపకార్యంబులివి సేయవలదు బాల॥ ౭

గీ॥ కాలమెప్పుడు నేరిత్తకర్జములనో,
గడపుకొనఁదాన శ్రేయంబు గలుగఁబోవ
దింటిపనులనో, విద్యనో, యంటియున్న
మేలు; బుద్ధికి మాంద్యతతూలు; బాల॥ ౮

గీ॥ మంచిగొనములఁ జనువ్రులఁ మించియున్న
వారినసుకరింపుము నీవుకోరినట్లు
చిలిపి బాలురఁజూచినఁ బలుకఁ
నైనవలవదు తలవంచి యరుగు బాల॥ ౯

గీ॥ పసిఁడియిచ్చిన కమసాలికసటుమాపి
వన్నెనిడి తెచ్చియిచ్చిన పగిదినొజ్జ

బుద్ధిపద్యలచే నిన్ను బ్రోదిచేసి
యిచ్చుఁదలిదండ్రులకు మేలు హెచ్చు బాల॥ ౧౦

గీ॥ సాయ మెవ్వరుఁ గోరిన శక్తి కొలఁది
సాయ మొసఁగుము మది నీకు సాయపడును
కష్టకాలంబులోఁ జింతిలక యుండఁ
గూర్మి చెలికానిఁ బోలె నిక్కముగను బాల॥ ౧౧

గీ॥ భూమిపై జంతువుల నెల్లఁ బ్రేమఁ జూచు
పరిభవింపంగ నోకదనిఁ బాలింపకు
చిలిపితగవుల దుష్టులఁ గలిసి తేకు
మూర్ఖవాదముల్ గావింపఁ బోకు బాల॥ ౧౨

గీ॥ కల్లలాడకు మెప్పుడు గానికార్య
ములను జేయకు నీకెంత గలిమి యున్న
గర్వపడఁబోకు పెదలఁ గనుఁగొనఁ జూచు
మంచిపద్ధతి యిది మదినుంచు బాల॥ ౧౩

గీ॥ అలవిమీరిన పనులకు సాహసింపఁదగదు
పిలువకుండఁగ బడికెప్పు డెడలవలదు
నెల్లవేళల సంతోషముల్లమందుఁ
బాయకుండిన సుఖములు ప్రబలు బాల॥ ౧౪

గీ॥ త్రాగకుము యెప్డు కాఫి, మద్యంబు లెల్లఁ
దినకుమా మాంసమంగట్టి తిండ్లు మఱిగి
నిల్పకుమ స్త్రీలపై భ్రాంతి స్వల్పమైన
నాడకుమ చీట్లు, పందెము లఘువు బాల॥ ౧౫

గీ॥ మంచిగాలిని పీల్చుట, మంచినీరుఁ
ద్రావుచుండుట, శుచియైన స్థలమునందుఁ
గాపురంబుంట, సాధారి పక్వాన్నములను
గుడుచుచుండుట, రోగములుడుగు బాల॥ ౧౬

గీ॥ పలక, బలపము, పొత్తముల్, వస్త్రములను,
శుభ్రముగనుంచి వేకువఁ జొరఁగలేచి
దైవమును గొల్చి కాలకృత్యములఁ దీర్చి
తానమాడియు బడికిఁ బోఁదగును బాల॥ ౧౭

గీ॥ భాగ్యములను దేహారోగ్యభాగ్యమే సు
భాగ్యమిల నేరికేనది పదిలపడదొ
వాఁడె నిర్భాగ్యుఁడగు సిరిఁ గూడనున్న
వానిననరాదు దానిని బడయు బాల॥ ౧౮

గీ॥ మంచివాఁడవు నీవని మాయఁజేసి
కొంటెపిల్లలు నిన్నది కోరిరేని
తల్లిదండ్రుల నడుగక తస్కరించి
తేకు; మది తప్పుతనమని తెలియు బాల॥ ౧౯

గీ॥ గురువు పాఠములను జెప్పఁ గూరుచుండి
చక్కఁగా విని చెప్పఁగా సంతసించు
శిక్ష సేయండు విద్యయు సత్వరముగ
వృద్ధియగు; గల్గు జ్ఞాపకశక్తి బాల॥ ౨౦

గీ॥ భూషణంబులకెల్ల సుభూషణంబు
విద్యయే సుమ్ము; యెవ్వండు విద్యలేని

బుడమిశోభింపఁజాలను జడతమాన్పు
విద్యధరియింపు ; భూషలు విడచిబాల॥ ౨౧

గీ॥ చిన్నతనమున పనులను జేయుమనుచుఁ
దల్లిదండ్రులు చదివింపఁ దలఁచుకున్న
నీవె యెట్టులో చదువురియో నేర్పుతోడ
బికిరమెత్తెడి పిల్లలవీధముబాల॥ ౨౨

గీ॥ భాను బింబంబు చేతను బంకజంబు
వికసనముఁజెందు కైవడి విద్యచేత
బుద్ధివికసించు ; సంపదల్పొదలు ; శీల
మార్గమలవడు ; దీనినేమరకు బాల ॥ ౨౩

గీ॥ కుందనమునకు నెలిగారమందినట్లు
బాల్యమున విద్యలెస్సగాఁ బట్టువడును
గాన పరువైన సమయంబు గాలిఁబోవఁ
జేయకెప్పుడుఁ జదువుమ చిడకబాల॥ ౨౪

గీ॥ కుదురుగాఁ దరగతి నీవుకూరుచుండి
ప్రక్కవారితో మాటలుదక్కి యొజ్జ
యేదిసేయంగ నియమించు నాదరమునఁ
జేయు మది; నీకుశ్రేయమౌనోయిబాల॥ ౨౫

గీ॥ బాలురందఱకంటెను మేలువాఁడ
వగు నటుల నీవుచురుకుగా నరుగఁదగును
జేనఁజొచ్చిన వెనుకంజఁబూనబోక
పరువున మేలుబంతివై నెగడుబాల ॥ ౨౬

గీ॥ చదువునప్పుడు, దేవుని ముదముతోడ
భక్తిఁ బూజించునప్పుడు, వలయుపనులు
చేయునప్పుడు, భయమును, సిగ్గు వలదు
చెడుపనులుచేయు నెడ నుంపఁ జెడవు బాల॥ ౨౭

గీ॥ భాగ్యమును జూడఁ గన్నులపండువైన
రూపమునుజూచి యెవరునీ దాపుఁ జేరి
ముద్దులాడంగవత్తురే! ముద్దు నోట
చదువు సద్గుణములుబడి బ్రదుక బాల॥ ౨౮

గీ॥ గురువుశిక్షను దప్పించుకొనుట కొఱకు
నప్పుడప్పుడ వల్లించి యొప్పఁజెప్పి
మఱుదినంబున లేకుండు మాయచదువు
వలవదే వేళనుండగా వలయు బాల॥ ౨౯

గీ॥ తల్లిదండ్రుల మఱిపించి తొలి నెటనో
యాటలాడుచు నెప్పుడు గూటదీప
ముంచిన పిలుసేరక యెప్పు మొదిగిమొదిగి
చేరి చదువక యుండకుమోరి బాల॥ ౩౦

గీ॥ నీళ్ళ, నిప్పుల, ముండ్ల, రాళ్ళ, సీకు
నాడఁబనిగాదు కీడగునయ్య యెందు
చెట్లు గుట్టలు గోడలు గట్లనెక్క
జనకు పడినను చిదుకౌను తనువు బాల॥ ౩౧

గీ॥ గొప్పకులమునఁ బుట్టితి నొప్పఁగుల్కు
రూపముండెనటంచుఁ గుఱాళ్ళౌన

మనుజులను హీనకులులను గనిన నగకు
చేతనగునంత ధర్మముఁజేయు బాల ॥ ౩౨

గీ॥ ధార్మికుని సిరియెల్లను ధర్మమునకుఁ
జేరునట్టుల వంశనిక్షేపమైన
బాలుఁడే వేళ బుధజనప్రాయుఁడగుచు
నుపకరింపను బ్రతుకు సత్కృపను బాల ॥ ౩౩

గీ॥ పెక్కువృక్షంబులను నొక్క చిక్క పరిమ
ళముల వెదజల్లు మలయజద్రుమము మాడ్కి
వెలయునొకడైన సుగుణము లలరియున్న
బాలకుడు పిల్లలకు మధ్య బడిని బాల ॥ ౩౪

గీ॥ ఎన్ని విఘ్నము లేతెంచి పన్నియున్నఁ
జేతఁబట్టినపని పూర్తి చేసిగాని
విడువనను గట్టిపట్టును పెట్టుకొనుము
దానఁ బనులన్ని సఫలములౌను బాల ॥ ౩౫

గీ॥ దీర్ఘకోపంబు మనమున దీటుకొలిపి
యెరినైనను సాధింపఁ గోరరాదు;
ఎంత యపమానపడియును సుంతయైనఁ
జింతసేయక యుందు సోచించి బాల ॥ ౩౬

గీ॥ కఠినముగ మాటలాడిన గౌరవంబు
పోవుటేగాక తగవులు పుట్టుఁగాన
వలదు; ప్రియముగఁ జెప్పదుఁ బలుకు మెందు
దానఁ బ్రేమజనించు నందఱకు బాల ॥ ౩౭

గీ॥ ఎట్టిపగవారికైన నీకొప్రముగాని
కీడుఁగోరకు కల్గిన వేఁడువలదు
నుండకేగియు వేగిర మందయుగుము
కడవఁ బెట్టఁగ నాపదల్ గడగి బాల॥ ౩౮

గీ॥ తల్లిదండ్రుల గారవమెల్లఁ దొలగ
నేనువడు చూచినది తెచ్చియిమ్మనుచును
తల్లిదండ్రుల యాజ్ఞలనెల్ల నెపుడు
చేయుమా! శిరసావహించియును బాల॥ ౩౯

గీ॥ కుడుచుటయుఁ ద్రావుటయు నిద్రఁగొనుట చేయు
పనులు చదువులు వ్యవహార వర్తనములు
క్రమముదప్పక నడుపుమీ! కానియెడల
వ్యాధులలమును సంకటపడుదు బాల॥ ౪౦

గీ॥ శుచిగ నొకచోట స్థిమితముఁ జూచినిలచి
విశ్వరక్షకుఁడైన గోవిందునామ
ముక్తకంఠమ్మైన స్మరియింప నోపుదేని
సర్వశుభములు పొందెదు సతము బాల॥ ౪౧

గీ॥ అతఁడుచేసినఁ జేయుదుననుచు నెపుడు
నొకరితో వంతునకుఁ గూరుచుండరాదు
చేయవలసిన పనులను న్యాయముగను
విధియనుచుఁ జేయుమెప్పుడైన విడక బాల॥ ౪౨

గీ॥ చేయఁగానీకు నేవనిఁజేతగాక
పరిహాసింపంగఁ బోయెదీ పాపమేమొ?

ఎన్ని నేర్చినఁ జేసిన సేవఁబనులు
గనినఁ బొగడుట మంచిదిగదర బాల॥ ౪౩

గీ॥ తినక పెట్టక మాటల మునిగి తేలు
కృపణుని ధనంబులట్టుల నుపశమించుఁ
దిరిగి చదువక యీకాలమునఁ గఱపఁబోక
మదిని బదిలంబు చేసిన చదువు బాల॥ ౪౪

గీ॥ చదువు నేర్చుట బుద్ధిని జక్కపఱచు
కొనుటకుంగాని దుష్టులఁగూడి యెప్పుడుఁ
గుట్రలను బన్ని కొంపలు గూల్చగాదు
వలదనిన వీడకుండ నెవ్వరికి బాల॥ ౪౫

గీ॥ బలము గలవాడనంచు దుర్బలురిటన్నఁ
గయ్యమొనరింపఁ గాల్దువ్వఁ ఘనతముగాదు
నిన్ను నొప్పించువాఁడైన నీబలంబు
వ్యర్థమగుగాదె! భీరుముల్ వలదు బాల॥ ౪౬

గీ॥ బడికిఁ బోనొల్లక గురుండు బాగుగాను
జదువుఁ జెప్పిన దినమెందు నెదకి లేదు;
ఏల పోవలె బడికి? నే నేమి చదువ?
ననుచుఁ బోషించువారితో ననకు బాల॥ ౪౭

గీ॥ ఎఱుఁగ రెవ్వరు నాకిది తెరుణమంచుఁ
బోకు పాపము లొనరింప నో కుమార!
నీవు మనుజుల కనుగప్ప నేర్తువేని
దైవముండదె సర్వము దలఁప బాల॥ ౪౮

గీ॥ మాటలను నేర్చి యెవరైన మాటలాడ
వినువుగొను రీతి నేమియు ప్రేలఁదగదు
యుక్తాయుక్తముగా ననుగిక్తి గలుగ
మితముగాఁ బల్కఁదగును యోగ్యతగ బాల॥ ౪౯

గీ॥ గురువు కోపించునని లోనఁగొణగికొనుచు
నడుగుమాటకుఁ బ్రతిఁజెప్ప కుడుగరాదు
తడవు సేయక ఘంటాపథంబుగాను
ప్రశ్నలకుఁ జెప్పఁదగినజవాబు బాల॥ ౫౦

గీ॥ చెప్పినది మోసమయ్యెను చేయ్వఁగున్నఁ
జెప్పఁబూనకు సాధనముప్పతిల్ల
చెప్పకుండినదాననే ముప్పులైనఁ
గలుగునెడ వెంటనే జెప్పవలయు బాల॥ ౫౧

గీ॥ పాఠముల నొక్కరొకైన వదలకుండ
పట్టుదలతోడఁ జదివినవచ్చు విద్య
లేనిచో నేండ్లుపోయినఁగాని రాదు
బడికి సెలవంచు లోఁగలుగదుప బాల॥ ౫౨

గీ॥ పస్తుబడియున్న వస్తువను బట్టఁబోకు
వ్యయము సేయకు ద్రవ్యంబు వ్యర్థముగను
కూడబెట్టు మార్గమందు కొంతయైన
ధర్మమును సేయుటొక కొంతతగును బాల॥ ౫౩

గీ॥ చెడినపనులను దలచుక చిత్తమందు
తీవ్రముగఁ జర్చ సేయుచు దిగులుపడుట

యధిక నాశంబె కాని యేమాత్రదానఁ
జేయునవియుండె చెడకుండఁ జేయు బాల॥ ౫౪

గీ॥ శ్రమకుఁ బాఱంబులని నిచ్చ చదువులుమాని
చేయనౌ కార్యములు పొందఁ జేసికొనిపి
చివికి చింతను దేలి యోచింపఁబోకు
శాంతముగ నిర్వహింపుమీ సరిగ బాల॥ ౫౫

గీ॥ వంపనౌ మంచి చేతి నెవ్వారలైన
గాని పగఁబూన లవలేశ మెసఁగాదు
నయముమీఱఁగ నెంమను నడువుమటులె
మానవులఁదండఁ బగ సేయమాని బాల॥ ౫౬

గీ॥ ఇంటివారితోఁ గోపించియింటనింటఁ
గాఁపురంపుగుట్టుఁ జెప్పుట గాదు గొప్ప
యొకరికంటెను హీనతనుండినైన
గుట్టుగా జీవనము సేత గొప్ప బాల॥ ౫౭

గీ॥ మాట నెఱపుకొనంగల్గి యోటులేక
యుక్తి సంభాషణంబుచే శక్తి గొలఁది
నొప్పు తప్పుగనూర్చి తప్పొప్పుఁ జేసి
మోనమునరించకది నీకుముప్పు బాల॥ ౫౮

గీ॥ కీడుఁ జేసిన వారికే మేలు జేయ
నది మనంబున వానినాయాస పెట్టు
వేఱురీతిగఁ గీడును వెదకు దేని,
నీకెయానది యీమాట నిజము బాల॥ ౫౯

గీ॥ పుష్పమును వాడఁజేయకే పుష్పరసము
ద్రావు మధుపంబుకైవడిఁ దా నెవరిని
నలయఁజేయక గుణవిద్య లమరునట్లు
పాటుపడు మంచిబాలుఁడు బడిని బాల॥ ౬౦

గీ॥ ఎవరిఁజూచిన భయభక్తు లెఱుగకుండ
నెపముకై నడి దెబ్బలకిచ్చి వీఁపు
దుడుకుఁదనముఁ జేయుచు నసిచుపాపఁ
డెను మెయాఁగాక ; కుఱ్ఱఁడే ? యెన్నబాల॥ ౬౧

గీ॥ ఎట్టివిద్యలభ్యాసముం బట్టియుండుఁ
గాన వీనకు ప్రాణాంతమైనదాఁక
దేన సాధనసల్పెదో దాన నీకుఁ
గొంగ్రు బంగారమగుచుండుఁ గూడి బాల॥ ౬౨

గీ॥ అదరిపాటేమి లేకుండ నందఱియెడ
నొక్కటౌ సోదరన్యాయమున్నవాని
దైవమెప్పుడు దీవించుఁ దనకుఁబోలి
యుండునట్లుగ ; నారీతి యుండుబాల॥ ౬౩

గీ॥ సంద్రమునఁజేరి చెడియెడు జలములట్లు
దుష్టులనుగూడఁ జెడుదువు; దుగ్ధములను
నీరు చేర క్షీరమైనట్లు నీతిపరుల,
నెయ్యమొనరించి బుధుఁడవై నెగడు బాల॥ ౬౪

గీ॥ ధన కుల, సురూప ములకును ఘనుఁడవైన
గౌరవము, కీర్తి, సంస్తుతుల్, గలుగఁబోవు ;

ధర్మమున్నన్యాయమును బుద్ధిఁదగిలెనేని
కలుగు నీకెల్ల శ్రేయము; లిలను బాల। ౧౫

గీ॥ కూడుగుడ్డకుఁ బేదయు, గురు వినీతి
నధికతోడసమంబుగ నలరుచుండుఁ;
దలఁగు నేనీతి, వాఁడు సంతాపతప్త
దేహుఁడౌ బుద్ధి సంపద దెగుట బాల। ౧౬

గీ॥ నీకెవరు చెప్పి చెడుపని నెఱపుమన్న
మాటవిని చేయఁబోకు మోమాటముంచి
తగినపనియైనఁ బదుగురు దలఁపకున్న
మానె; యొనరింపుమీ! యదిపూని బాల। ౧౭

గీ॥ గురువు నిన్నెప్డు కోపించి కొట్టెనేని
మనసులోనైనఁ దిట్టుటమాని యతఁడు
సాయమే మేనిఁగోరిన సలిపి గురుని
ఋణము నీఁగుట యొప్పిన గుణము బాల। ౧౮

గీ॥ పెద్దబండను దలమీఁద పెట్టియున్న
మోయుదే? కూలిపడి నలిగిపోదుగాక
యీడెఱుంగక యింతంతలేని పొత్త
ములను జదువ మెదడు చెడిపోవు బాల। ౧౯

గీ॥ మొలకపుట్టిది రోజులకొలఁదిఁ బెరిగి
పెరిగి వికసించి పెద్దదె వెలయుఁగాదె?
విద్యలన్నింట నొకనాఁడె పెద్దఁజేయు
మన్న నెట్లయ్య? క్రమముగా నగుదు బాల। ౨౦

గీ॥ తనకుఁ దానెద్దియును దీర్పఁదగినశక్తి
యేపనులు నంతలో సేయనెఱుఁగుబుద్ధి
కౌశలంబును, మాహాయు, గలుగునట్లు
చదువు మెప్పుడు, వల్లెలు వదలి బాల॥ ౭౧

గీ॥ చెఱచి యితరుల తామును జెడెడు నరుల
వేదముల వర్ణముల దూరి వాదులాడ
వినకు చెవియిచ్చి నీకది పెంపుగాదు
చెడుదు నీపూర్వధర్మము చెఱచి బాల॥ ౭౨

గీ॥ ఆచరించి ధర్మములెల్ల నఖిలమునకుఁ
గర్తలై ధర్మపథమును గదలకుండ
ధర్మములు బోధచేసిరి దయఁదలిర్పఁ
బూర్వికులువారి సలుపంగఁ బోలు బాల॥ ౭౩

గీ॥ రిక్తగాఁ గూరుచుండియు భుక్తి కొఱకుఁ
జేయు యోచన లేమిట శ్రేయమౌను?
పనులయందున శక్తితోఁ బాటుపడుచు
బ్రతుకఁదగవగు నప్డు యోగ్యతగ బాల॥ ౭౪

గీ॥ భూతహితవుగ నేకార్యములనునైనఁ
జేయుశుభదంబె కాకున్న జేటుఁదెచ్చు;
తనకె యాయువ్వ మారోగ్యమని దలంచి
క్రూరమును సల్పబోవుమార్గునకు బాల॥ ౭౫

గీ॥ దైవమును నమ్మితాఁ బ్రయత్నంబు సలుప
నెట్టికార్యంబులైన గట్టెక్కుచుండు;

లేనిచో నన్ని విఫలంబులౌను గృషియు
వర్షమును లేని సస్యంబుపగిది బాల! 26

గీ॥ ఏల ? సంపాదనకుఁగాని మేలిగొనము
లబ్బుటకుఁగాని చాలని యట్టిచదువు;
రెండుగల్గియు నిహపరముండునట్టి
చదువుఁ జదువంగ సంతోషమొదవు బాల! 27

గీ॥ పొత్తముల నక్షరపు రూపమునను నిలుచు
భారతీదేవి; కావునఁ బ్రబలమైన
భక్తి నిత్యము పాఠముల్ పఠన జేయు
నపుడు దలఁచిన విద్యలు నమరుబాల! 28

గీ॥ వ్రాతబల్లలు, పటములు, పలకబలప
ములు, సిరాబుడ్లు, కాగితములు, కలములు,
అంబ - వాణి - వసింపగా నమరునిండ్లు
కాన వానినిభక్తితోఁ గనుముబాల! 29

గీ॥ దేశభాషను, గణితము, దేశధర్మ
ములను, ముఖ్యంబుగా నేర్వవలయు మొదట;
పిదపఁదన కులోచితమైన వృత్తిఁబూని
భుక్తికై పాటుబడుటది పోలుబాల! 30

గీ॥ చాల పొత్తములెల్లను జదివికొనుచు
శుద్ధమగు భాషనేర్వంగఁ జూడుమయ్య;
వ్యర్థమగుభాష నేర్చుకు పలుకఁ బోకు
తనువు కష్టంబెగాయది తలుపబాల! 31

॥ ధర్మసంగర మొనరింప ధర్మపరుల
చరితలను నేర్చివారల సద్గుణములు
నిన్నుఁబొందంగ నడువుమీ! నియతినట్లు;
పేరుగల్గిన బ్రతుకునుగోరి బాల॥ ౯౨

॥ మోదుజివురింప, గింజలు మొలకలెత్త,
రాలుకరుగంగఁ బక్షులు వ్రాలమీఁద,
గానకళ నేర్తువా! నీవఘనుడవగుదు;
వెల్లరును నీకెనశులౌదు రెఱుగు బాల॥ ౯౩

॥ చిత్తరువు బాగుగా వ్రాయఁజేతనైన
దేవతా రూపములను జిత్రించిచూపి
మనుజులకు భక్తిఁకలిగించి మనుపవచ్చు;
న్యాయపద్ధతి ద్రవ్యమునబ్బు బాల॥ ౯౪

॥ చేతిపనులు సేద్యంబును జేయువిధము,
బాగుగా నేర్చికొనుము నీ బాగుఁదెరువె;
సేచ్ఛగా జీవనంబును జేయవచ్చు;
గౌరవముతోడి బ్రదుకౌనుగాదె బాల॥ ౯౫

॥ చిన్ననాఁటఁ బ్రహ్లాదుండు శ్రీహరీ! జ
గన్నియామక! నను(బ్రోవఁ గంబమందుఁ
బొడమవే యనఁబుట్టి మేల్పొదలఁజేసెఁ;
గాననాహరిభక్తిచే గాంచుబాల॥ ౯౬

॥ నారదాదులరీతిగాఁ గోరినీవు
కృష్ణ!, గోవింద!, కేశవా!, విష్ణుగార!

మనుచు హరినామములను కీర్తనము జేసి
పాపములనెల్లఁ బాపుకోవలయు బాల॥ ౮౭

గీ॥ చిఱుతనాఁడె శ్రీకృష్ణుండు చెలువుగుఁడు
తల్లిదండ్రుల బాధలు తలఁగఁద్రోసి
ప్రజలనందఱ రక్షించె పరమకృపను
పిన్నవాఁడైన గుణమునఁ బెద్ద బాల॥ ౮౮

గీ॥ మనుజులందున ఘనుఁడెప్డు కనఁబడండు;
యొదిగియుండును; నీచుఁడు నొదగఁబోక
యూఁచుచుండును లేచి పుల్లాకుపోలెఁ,
గాన ఘనునిట్లు కనిపెట్టి గాంచు బాల॥ ౮౯

గీ॥ న్యాయపథమును దప్పక నడచునరుఁడు
పేరుబొందంగఁ గానివి పెట్టుకొనఁడు
విహిత కార్యములను జేసి వెలయుచుండుఁ
బ్రజలకెగ్గులు సలుపఁ బొల్పడక బాల॥ ౯౦

గీ॥ అక్కరనుబట్టి యాచార మొక్కరణిని
బుధులు మెత్తురు? కైకొనఁ బోలదెందు
ధర్మమారసి నడుపఁగాఁ దగును సత్య
వాక్కునెపు డాఁటఁ గట్టంగఁబడుచు బాల॥ ౯౧

గీ॥ నిన్ను శిక్షించువారు లేకున్న, నున్న
నీకు నీవె సాక్షిగనుండి నేర్పుతోడ
నీతిమార్గ మపేక్షింప నేరవలయుఁ
జెప్పువారలు లేరని చెడకు బాల॥ ౯౨

గీ॥ జంతువులు, శశికాంతములు, వృక్షములు, నదులు
సంద్రములు, పర్వతంబులు, జలధరములు
ధర్మమునఁదప్పి మెలఁగవీ ధరనుకంటె!
వానివలె నీవునుండగావలదె బాల॥ ౯౩

గీ॥ కాసు, వీసము పోలని ఘనలు కొంద
ఱన్నిటను తామెయధికులమంచు నెగడి
ప్రజలచే సెప్పు చీవాట్లు పడుచునుంద్రు
వలవదట్టుల, నీశక్తి మెలఁగుబాల? ౯౪

గీ॥ చిత్ర మీశ్వరసృష్టి; విచిత్రమౌను
దానికంటెను గులముల గిగవులాట;
యెంతకధికంబు చదివియు నంబనైన
స్వకులధర్మంబునైనఁ, జేవదలబాల॥ ౯౫

గీ॥ నూరుమాటలు క్రియమాని నుడువుకంటె
నొక్కటైనను గ్రియఁజూప నొప్పునెందు
నూరునీతులు నేర్చి నీవూరకుండు
కంటె నొకటైనసల్పుట ఘనముబాల॥ ౯౬

గీ॥ మల్లెపూఁదాకవలె మంచిపిల్లలెవ్వరు
నిట్టినీతులునేరిచి యెల్లకడలఁ
బొగడఁబడుచుంద్రు నూవె యీభువిని దేట
వెన్నెలలను మించెడు కీర్తి వెలుఁగబాల॥ ౯౭

గీ॥ మనలకధికారులై మెలుఁగనఁగఁ జేయు
నధికవిద్యాప్రవరులు విద్యాధికారు
లకుఁ బ్రజాప్రభుత్వపు సభ్యులకును నెపుడు
జయముగలుగ దేవుని వేడఁజనుము బాల॥ ౯౮

గీ॥ మనల కాపదలను బాపి మనుచునట్టి
వాసుదేవునకెప్పుడు దోసిలొగ్గి
భక్తిఁ బ్రార్థించి జయజయధ్వను లెసంగ
మంగళారతులను నిచ్చి మనుము బాల॥ ౯౯

గీ॥ పావనంబైన కౌణిదెన వంశజుండు
నతుడు వేంకటనారాయణాఖ్యుఁ డెలమి
బాల గీతాళినీతులు జాలనించి
శతకమునుఁ జెప్పెఁ బాలురు చదువ బాల॥ ౧౦౦

